చరణంలోని శయ్యా సౌభాగ్యాన్ని సహృదయులు గుర్తిస్తారు.

"రఘునాయక" అన్నది హంసధ్వని రాగం కీర్తన. హంసలు కలియుగంలో లేవని ప్రథ. వాటికూజితం మన మెవరమూ వినలేదు. కాని, "రఘునాయక" కీర్తన రచనా రమణీయకమే హంసధ్వనిని మించి పోయింది.

*రఘునాయకా నీపాదయుగ*
*రాజీవములనే విడజాల శ్రీ.*
*అఘజాలముల పారద్రోలి న*
*న్నాదరింప నీవే గతికాదా! శ్రీ*
*భవసాగరము దాటలేకనే*
*బహు గాసివడి నీ శరుగు జేరితిని*
*అవనిజాధిపా శ్రితరక్షక*
*ఆనందకర శ్రీత్యాగరాజనుత శ్రీ.*

సగణ యగణ భగణాలు వరుసగా పడగానే హంసకూజితం పుడుతుంది.

శుద్ధసావేరిలోని "కాలహరణ మేలరా హరే సీతారామ" అనే కీర్తన అభ్యర్థనకు ఎంతగా రూపు కట్టిస్తున్నదో చెప్పనక్కరలేదు.

ఎక్కడో వున్నవారిని పిలిచి మొరపెట్టుకొనడానికి దేవగాంధారి వంటి రాగంకన్నా మించినది లేదేమో! త్యాగయ్యగారి "క్షీరసాగర శయనా" కృతి భక్తుని మొరకే తార్కాణం. అది కవితాదృష్టితోనూ గొప్పది.

*క్షీర సాగర శయనా నను*
*చింతలు బెట్టవలెనా రామ !*
*వారణ రాజును బ్రోవను వేగమే*
*వచ్చినది విన్నానురా రామ !*

నారీమణికి చీర లిచ్చినది
నాడే విన్నానురా రామ !
ధీరుడౌ రామదాసుని బంధము
త్రెంచినది విన్నానురా రామ !
నీరజాక్షికై నీరధి దాటిన నీ
కీర్తిని విన్నానురా రామ !
తారక నామ ! త్యాగరాజనుత !
దయతో నన్నేలుకోరా, రామా ! క్షీర ...

దీనిలోని ప్రతిపదమూ, మొరను ముమ్మరంగా తెలిపేవే.

నా దృష్టిలో "మధ్యమావతి" రాగంలోని "అలక లల్లాడ గని" కృతి త్యాగయ్యగారి కవితా కమనీయతకు పరాకోటులయిన కృతులలో ఒక్కటి. త్యాగయ్యగారు యుద్ధంచేస్తూ రాక్షసులను పారద్రోలుతూ ఈషణ్మాత్రమైనా శ్రమచూపని రాముని బాలసుందర వదనాన్ని, లలాట పర్యంత విలంబితా లకమైనదానిని వూహించి పొంగిపోయారు. ఆ పొంగులు రామలక్ష్మణులకు శస్త్రవిద్యను నేర్పిన విశ్వామిత్రుని దృష్టితో వూహించారు.

"అలక లల్లాడగ గని
యా రాణ్ముని యెటు పొంగెనో !
చెలువుమీఱగను మారీ
చిని మదమణచెడివేళ.
ముని కనుసైగ దెలిసి శివ
ధనువును విఱచెడి సమయ
మున త్యాగరాజ విను
తుని మోమున రంజిల్లు.
అలక లల్లాడగగని."

ఇదేమిటి కీర్తనా ? కవితా ? రాగానుగుణ మయిన. అద్భుత రసానుగుణమైన పదగుంఫన ఎంత సహజంగా సాగిందో? పల్లవిలోని పూర్వార్థం కదం తొక్కుతూనడిచి, అలకలు గాలికి ఎగురుతున్నట్టుకదలి, ఉత్తరార్థంలో రేచిత గతిని అందుకొంది. దానితో పూర్వార్థంలో అలకలను చూచినప్పటి ఆసక్తి, ఉత్తరార్థంలో రాణ్ముని ఎదదలోని పొంగూ కనులకు కట్టాయి. శివధనుస్సును అనయాసంగా విరిచాడనే భావాన్ని చరణం పూర్వార్థంలోని లఘువుల రచనతో తెలిపారు కవి త్యాగయ్యగారు.

కేవలం కవితా దృష్టిలో చూచినా కదలక నిలబడే కృతులలో ఒక్కటి "కద్దనువారికి".

*"కద్దను వారికి కద్దు కద్దని మొరనిడు*
*పెద్దల మాటలు నేడబద్ధమవునో !*
*అద్దంపు చెక్కిళ్ళనే*
*ముద్దుగాను మోము జూడ*
*బుద్ధి గల్గినట్టి మా*
*వద్ద రావదేమి రా !*
*నిద్దుర నిరాకరించి*
*ముద్దుగా తంబురబట్టి*
*శుద్ధమైన మనసుచే*
*సుస్వరముతో*
*పద్దు తప్పక భజియించే*
*భక్తపాలనము చేయు*
*తద్దయాశాలివి నీవే*
*త్యాగరాజ సన్నుతా."*

త్యాగయ్యగారు రాగావతారం, మహా కవులకు భావానుగుణమైన భాషా, వృత్తమూ సహజంగానే సమకూరి నట్లే, త్యాగయ్యగారి రాగ ప్రస్తారానికి అనుగుణమైన రసభావ భాషలను కృతులు రూపొందించు కున్నాయి. రాగ రస భావ భాషలతో కృతులు సమగ్ర సుందర కుసుమా లుగా వికసించాయి. ఆయన దృష్టి రాగ సుధారసమే కాని కవితా రసం కాదు. అయినా, అది కాకతాళీయంగాకాక, సహజసుందరంగా రాగ రస భాషలకు పూవులోని రేకులకు, కేసరాలకు, సౌరభానికిగల సమపొత్తులా సమన్వయం కూర్చింది.

నాకు, సంగీతానికి సగమెరిక. అందువల్ల కవితాదృష్టితో మాత్రమే నేను త్యాగయ్యగారి కృతులను చదివి ఆనందిస్తుంటాను. అవి ఆయనను కవిగానూ కలకాలం నిలుపగల చేవ గలవని నమ్మే వారిలో నేనూ ఒక్కణ్ణి.